# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య










FATHER OF INDIA

ప్రకాశకులు:
రామా అండ్ కో.
H.O. ఏలూరు

V.S. GURU

# విషయసూచిక



---

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 40 | ఏలూరు, 15 అక్టోబరు | సంచిక 7 |
| --- | --- | --- |





**వివరణము :**

సద్వస్తుసందర్శనము మనభావముల కందదు. మన కాస్థితి లభించినపుడు ఈ యోగ్యతాయోగ్యతలు, భోగభాగ్యములు, సుఖదుఃఖములు, మొదలగు ద్వంద్వములు కనపింపవు. మన కొక నూతనశక్తి యలవడును. ప్రపంచమంతయు నూతన స్వరూపముతో, నూతనవికాసముతో కనుపించును. లోకవ్యాపారములకు కొంతకాల మావశ్యకమగునట్లు మన ఆధ్యాత్మిక సాధనకుగూడ కొంతకాలమును వినియోగింప వలెను. ఈ విధముగ మనము నిత్యము చేయుచున్నచో మనకు తప్పక దైవసందర్శన మగును.

**సంకీర్తనము :**

హే సర్వాంతర్యామీ ! నీ సాయమేకాని నాస్వతంత్రశక్తి యెందుకును కొఱగాదు, నా చిత్తము నీయందు లగ్నమై విషయ వ్యామోహమునకు అతీతమై నీ చెంతనే వసించును గాక !

స్వామి రామతీర్థ.

## * విద్యాప్రచార గేయము *

రచన : శ్రీ దుంప రామమూర్తి

బడులకు పిల్లల పంపండీ! మన
అవిద్య సంఖ్యను మాన్పండీ!

1. బడులకు పిల్లల పంపగలేరా
అవిద్య సంఖ్యను మాన్పగలేరా
బడికిపోని బ్రతుకా—వెంబడి లేని సేద్యము
పనికి మాలినది కదరా! ॥ బడు॥

2. చదువే జ్ఞానము—చదువే ముక్కన్ను
చదువే సర్వముగాదా
చదువు లేనివరులు జీవిత
సంతస మందగ లేరుగదా! ॥ బడు॥

3. ఆంధ్రదేశము—మనమాంధ్రులము
ఆంధ్రమైనను నేర్వగ వలదా
తెలుగు తేనెయగు తెలిసిన వారికి
తేటను గ్రోలగ వలదా! ॥ బడు॥

4. కౌలు వ్రాయగను—కమ్మ వ్రాయగను
గణిత శాస్త్రమును తెలియంగా
పలుకు చక్కబడ నేర్వగ వలదా
భారతీయులము కావలదా! ॥ బడు॥

5. తప్పక బడులకు చదువు నేర్చుకొన
తమతమ బిడ్డల పంపండీ!
ఒప్పుగ విద్యల నేర్చి బిడ్డలు కడు
గొప్ప గాంచెదరు కనుగొనుడీ! ॥ బడు॥

---

## * కథాగీతాలు *

### "చిరంజీవి"

**1. కుక్క – మాంసపు ముక్క**

కుక్క యొక్కటి మాంసపు ముక్కతోడ
నదిని దాటుచు తననీడ నందు జూచి
తలచె వేరొక కుక్కని; నిలిచి మొరిగె;
నున్నదియును పోయె; – శోకాన నూరకేగె.

**2. పులి – బ్రాహ్మణుడు**

"అడుసులో నుంటి–వెలివేయ కడియ మిత్తు
బాపడా! యంచు పులి యాస జూప నతడు
చెరువులోదిగ 'సద్దిరా! దొరకి' తెంచు
వెలికిఁ దెచ్చి భుజించె నాపులి యతనిని.

**3. కాకి – నక్క**

చెట్టుపై నొక్క రొట్టెతో చేరె కాకి;
నక్క యొక్కటి 'చక్కని బావ! ఒక్క పాట
పాడు' మనపొంగి 'కావ్' అనబడియె రొట్టె
నక్క కొనె దాని; కాకిని వెక్కిరించి.

**4. వర్తకుడు – గాడిద**

భారము దొలంగ ద్రోవలో ప్రతిదినంబు
నీట లవణంబు ముంచెడు–వాట మెఱిఁగి
వర్తకుఁడు స్పాంజి గట్టిన వార్తఁ గనక
నీట మునుఁగు గాడిదమేని తీట యణఁగె.

**5. గ్రుడ్డివాడు – లాంతరు**

అంధు డొక్కఁడు లాంతరు నంది నడువ
'ఏల నీకిది?' యను కొంటె బాలుర కనె;
'మీరు నను గానబోక నామీద పడక
ప్రక్కకేగంగ మీకయి పనికివచ్చు.'

# గవర్నమెంటు హిల్ స్కూలు పర్యటనము

జి. విజయభాస్కర పట్నాయక్.

"వంటికి సుఖము, ఇంటికి దరిద్రము" అన్న సామెత మన పూర్వీకులకు నేటి ప్రపంచములో సార్థక నామధేయమై యున్నది. ఏమన, పని చేయుటకొ కష్టములేదు. దరిద్ర మనుభవించుటకొ అంతులేదు. ఇంతకు నే వ్రాయునది శెలవయినప్పటికి మన వుత్కృష్టబిరుదు నుదహరించవలసివచ్చినది.

నేటి మన విద్యావిధానములో ప్రయివేటు మేనేజిమెంటులనియు, బోర్డుపాఠశాల లనియు, పంచాయితీపాఠశాల లనియు, మునిసిపాలిటీపాఠశాల లనియు, గవర్నమెంటు హిల్ స్కూల్సనియు, ఒక్కొక్కపాఠశాలకు ఒక్కొక్క నామధేయ మిడిరి. శెలవులుగూడా స్కూళ్ళనుబట్టి యుండును. బోర్డు పాఠశాలలకు మే నెల 15 తేదీనుండి జూన్ నెల 14 తేదీవరకు వేసవిశెలవులు. ఇంతకు నేను బోర్డుపాఠశాలకు చెందినవాడను. నా శెలవుకాలములో నాకు తలవనితలంపుగా ఎప్పుడు ఏగని ప్రదేశమునకు పర్యటనము తగిలినది. అట్టి పర్యటనములోగల విషయములను నాకు తెలిసినంతమట్టుకు వ్రాయ నిచ్చగించినందులకు ఉపాధ్యాయ సోదర సోదరీమణులు విసుగుజెందక నన్నొక స్వార్థపరునిగా తలంపరని నమ్ముచున్నాను.

గవర్నమెంటు హిల్ స్కూళ్ళలో నాసోదరులు, బావలు గలరు. అట్టి హిల్ స్కూళ్ళలోగల అరుకు H. M. గా నా సోదరాగ్రజులు పనిచేయుచుండిరి. వారిపై భగవంతుడు మోపిన కష్టమునకుగాను నేనున్నూ, పూజ్యురాలగు నా జననియు వెళ్ళవలసి వచ్చినది. 26-5-51 తేదీ శనివారం మధ్యాహ్నము బయలుదేరి $4\frac{1}{2}$ గంటలకు పార్వతీపురంలో ట్రయిను ఎక్కి ఆరాత్రి కొత్తవలస స్టేషనులో బసచేసితిమి. ది. 27-5-51 తేదీ ఆదివారం ఉదయము కొత్తవలస నుండి శృంగవరపుకోట 11 గంటలకు చేరుకుంటిమి. అచ్చటవరకు మనకు ప్రయాణసౌకర్యము గలదు. ఆ దినం 12 గంటలకు అరుకుపోవు బస్సు నెక్కితిమి. అటనుండి పర్వత దృశ్యములు చాలామనోహరముగ నుండి నా మనస్సును లాగుచుండెను. మోటారుబండి సరిఅయిన బాటమీద యించుమించుగ పది మైళ్ళు పోయి యటనుండి కొండ నెక్కవలసియుండెను. మోటారు గిరుల సమీపించెను. ఈ కొండలలో అచ్చటచ్చట కొండజాతివారు నివసించుచుంటిరి. మోటారు క్రమముగా మీది కెక్కినకొలదియు సృష్టి వైచిత్ర్యము నేమని వర్ణింతును? దానిని చూచియే తీరవలయును. మోటారు మాటిమాటికి వంపులుగా తిరుగు బాటమీదకు నెక్కుచు మనుష్యులను మానవ లోకమునుండి యూర్ధ్వముగా గొనిపోవుచున్నట్లుండెను. ఈ బాటకొకప్రక్కను వంపులకొండ యేనుగుల ఎత్తుగల కర్కశశిలలును, రెండవప్రక్క చెట్లతోను, తుప్పలతోను, నిండిన అధోలోకమా అన్న లోయలును గలిగి విపరీత దృశ్యములు కాన్పించుచుండెను. బాట నిడానముగా నుండదు. ప్రతి నిముషమునకు కొండనుచుట్టి గుండ్రముగా తిరుగును. ఇట్టి వంపులు వందలకొలది యుండుటచే మోటారు చోదకుని దృష్టి యించుకయు చలింపక తదేక ధ్యానముతో ముందు బాటమీదను, వానిచేయి మోటారు నడుపు చక్రముమీదను వుండును. అతడేమాత్రము పరాకుగానున్నను ముందు వెనుకల వంపులనుండి యే మోటారువచ్చి మీదపడునో అన్న భయముచే మాటిమాటికిని నతడు శబ్దపుతిత్తి నొక్కి ధ్వని చేయుచుండును. యింత చాకచక్యముతో పనిచేయు మోటారువానిని మనసులో ప్రొక్కుకొనుచు "నాయనా! మా ప్రాణములన్నియు నీ యొక్క చేత నున్నవి. నీవే మా పాలిటి యీశ్వరుడవు. మత్స్య యంత్రమునుగొట్టిన యర్జునునకు నీవేమాత్రము తీసి పోవు" అనుకుంటిని. ఇట్టి డ్రయివరు యుండుట ప్రయాణీకుల సౌకర్యముకొరకే అని తలంతును.

ఇట్టి త్రోవలో వకప్రక్కనున్న పర్వతములలో నుండి క్రిందికి ప్రవహించుచున్న కొండ కాలువలు లెక్కలేనన్నియుండెను. మోటారు నిముష నిముషమునకు కొండజుట్టి తిరుగుటచే మాలో గొందరికి వాంతులు ఆరంభించెను. నామాతకు గూడా వాంతులయి కడుపులో నొప్పిగూడా కలిగినది. అప్పుడు మోటారునాపి కొంతవిశ్రాంతి పొందనై కారు నడువసాగెను.

ఇట్టి సృష్టివైచిత్ర్యము చూడ నాకొక స్వప్న ప్రపంచమువలె దోచెను. ఒకవైపు కొండశిఖరములు, ఒకవంక పాతాళలోకపు గుహలో యనునట్లున్న లోయలు, ఒకచో గలగల శబ్దముతో వంకరగా పోవు కొండకాలువలు, ఒకచో దూదిపింజలవలె గూడుచు విడిపోవుచున్న మేఘములు, మొదలగున వన్నియు నాకు దిగ్భ్రమ గలుగజేసెను. ఇట్లు తే 27-5-51 దీ ఆదివారము దాదాపు $3\frac{1}{2}$ గంటలు ప్రయాణము చేసి అరకులోగల నా అగ్రజుని గేహము చేరితిని. ఇక నచ్చట పరిసరముల గురించి కొంత ముచ్చటింతము.

వాతావరణము : మండువేసవిలోగల మేనెలలో సూర్యుడు సుమారు 10 గంటలకు కనిపించును. అంతవరకు మంచుతో నిండియుండును. మరల మధ్యాహ్నము 3 గంటలకు వర్షారంభము జరుగును. ఇక వర్షఋతువులో నెట్లుండునో చూడుడు! అందుచేగాబోలు ప్రభుత్వమువారు ఆస్కూళ్ళకు జూలై ఆగష్టు రెండునెలలు శలవు లిచ్చియున్నారు. ఇచ్చట ఎల్లప్పుడు తేమగలిగి యుండును. ఎటుజూచినను బహిరంగప్రదేశము గాక, తుప్పలతోను, లోయలతోను, నిండి ఏ అడవిమృగములు వెంటాడునో అన్న భయము గొలుపును. ఎటుపోవలయునన్నను, కొండలెక్కుటయో లేక లోయలలో దిగుటయో జరిగితీరవలయును.

ప్రజలు : ప్రజలు అనాగరికులు. కొండజాతి వారును వాల్మీకులు గలరు. వారిని జూచిన వింత గొలుపుచుండును. వారితో మాటలాడుటయే కష్టము. వారు అడవులు నరకి పంటలు పండింతురు. మనవంటి వారిని గూడా వారు వింతగనే చూతురు. ఇట్టి ప్రాంతములలో పనిచేయు ఉపాధ్యాయులు వారిని గురించి పుట్టబడ్డట్టున్నది.

బడులు : ఈ బడులు గవర్నమెంటువారిచే నడుపబడుచున్నవి. మన బడులకు ఆ బడులకు తేడాగలదు. ఈస్కూళ్ళబిల్డింగులు వాటిమరమ్మత్తులు వగైరాలన్నియు గవర్నమెంటు వారివి. స్కూల్ఫర్నిచరు వున్న వుపాధ్యాయులకే గాక యింకొక యుపాధ్యాయునకు సరిపోయి వుండును. సృష్టివిద్యకు సరిపోవు పనిముట్లు అన్నియు గలవు. ఒకవేళ యేదిపోయినా వెంటనే గవర్నమెంటువారు సప్లై చేయుదురు.

ఇంతియేగాక పిల్లలకు బట్టలు, పలకలు, పుస్తకములు, గూడా ప్రభుత్వమువా రిత్తురు. కరస్పాండెంస్సు గురించి యుపాధ్యాయులకు ఎట్టి ధనవ్యయము లేకుండా పోస్టలుస్టాంపులుగూడా ప్రభుత్వము వారివే. మొత్తముపై స్కూలునకు వుండవలసిన వస్తువులలో ఏమాత్రము లోపములులేవు. సరిగాపనిచేయవలయునన్న అట్టి సప్లైలుగలస్కూళ్ళలో పనిచేయుటయే ఉపాధ్యాయపదవికి మంచిమార్గము.

ఇదియేగాక బడిశుభ్రపరచుటకు ఒకనిని, (స్వీపరు) పిల్లలను పిలుచుటకు (గయిడు) ఒకనిని, జీతములపై ప్రభుత్వమువారు నియమించిరి. ఇట్టి నియమములు కలుగజేయుట ప్రభుత్వమునకు ఆ స్కూళ్ళయందున్న అభిమానము తెలుపుచున్నది.

ఇన్నిసదుపాయములున్నా నుపాధ్యాయునకు కష్టము తప్పలేదు. తాను వుదయముననే లేచి, తన కాలకృత్యములు నిర్వర్తించుకొని, ఒకగంటముందుగా బయలుదేరి, ఆ మోటుప్రజల ప్రతియింటికిపోయి, పిల్లలను పిలుచుకవచ్చి, తనపనిని చేయవలెను. ఇంత కష్టపడి పనిచేసినను, వారికి ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటువారుగాక, రివిన్యూయినస్పెక్టరు అగాయితూ కలెక్టరువరకుగూడా వారిపై అధికారులే. మనవలె గాక వారికిచ్చు జీతములుగూడా ఎక్కువే.

జీతములు ఎక్కువయినను సరే, స్కూళ్ళకు సదుపాయములు గలిగియున్నను సరే, ప్రయాణసౌకర్యములు లేనిది, నాగరికత ప్రదేశము కానిది, ఆరోగ్య ప్రదేశముగాక మలేరియాతో నిండియుండునదియు, మంచుప్రదేశమయినదియు, ఆ పర్వతశిఖరములలోను, కొండలోయలలోను, ఆ మోటుప్రజలతోను, తాను, తన ఆలుబిడ్డలు ఎల్లప్పుడు మలేరియాలతో బాధలు పొందియు, మనవలె ఆహారదినుసులు, మందులు దొరకక, కష్టములపాలై, భార్యయున్న బ్రహ్మచర్యమువలె జీవితములు గడుపుచున్నారన్న, వారికి విధివ్రాతయే యనుకొనుటయేగాక మనకంటె బ్రతుకు తెరువులేనివారని తోచుచున్నది.

ప్రభుత్వములోగూడా పక్షపాతమున్నది. ఆ హిల్ స్కూళ్ళకు అన్ని సదుపాయములు గవర్నమెంటువారు చేసియున్నారు. అందులో కొంత అయినా మనస్కూళ్ళకు సప్లై చేసియుండిన, ఆ యుపాధ్యాయులలో కొంతయయినా మన కష్టపడిన, మనస్కూళ్ళ ఆ స్కూళ్ళకంటె బాగుండును. ప్రస్తుతము ఏస్కూళ్ళసరిగా పనిచేయుచున్నవన్న ఆ హిల్ స్కూళ్ళే. మొత్తముపై వారిసదుపాయములు, వారి

# కన్నకడుపులో కత్తిపోటు

రచన :
లాము ఇశ్రాయేలు-విద్యార్థి,
ఏలూరు.

[గతసంచిక తరువాయి]

తూర్పుదిక్కు తెలతెల్లవారుతోంది. అప్పుడే లేచి వెంకన్న తన నిత్యకృత్యాలోనికి వెళ్ళిపోయాడు.... ఇంతలో—

అరుణరేఖలు కిలకిలా నవ్వుతూ ఉద్భవించాయి. ప్రకృతంతా రవికాంతులతో రమ్యమొనర్చుకుంటుంది. తెరువులమీద పక్షితల్లులు ఉదరపోషణకై ప్రపంచం మీదికి రివ్వున లేచిపోతున్నాయి. ఆకులాకు చాటున అలుముకుంటున్న అరుణకాంతి అలికిడిలేని మధు ఇల్లుచొచ్చి నిద్రావస్థలోని అతని సుఖాన్ని ఒక్కసారిగా ముద్దిడుకుంది. ఆ వెచ్చని మమతతో అతని నావరించియున్న నిద్రాదేవి అతనిని విడిపోయింది. త్రుళ్ళిపడిలేచి ప్రక్కకు చూశాడు. అప్పుడే ప్రసరిస్తున్న రవికాంతులు సగమువరకు శిథిలమైన పడమటి గోడలపై ప్రకాశిస్తున్నాయి. "అరె! తెల్లవారి పొద్దుకూడా పొడిచిందనుకుంటానే. నేనింకా నిద్రలోనే యున్నాను. బడి టైముకూడా కావచ్చిందే! "అమ్మా!...అమ్మా!" అని తొందరపడుతూ లేచి వెళ్ళి తన వృద్ధమాతను లేవగొట్టాడు. పండ్లు తోముకొని దానితోపాటు ప్రాతఃకాల స్నానమాచరించి ఉతికియున్న ఆ చింకిపీలికలనే ధరించాడా విద్యార్థి.

ఇంతలో ఆ వృద్ధమాత రాత్రితినగా మిగిలియున్న గంజి అన్నము నేపాసి పెట్టింది. దానితోనే కడుపు నింపుకుని స్కూలుకు తరలివెళ్ళాడు మధు. హాజరు పట్టీలో ఆరవ నెంబరు 'మధు' అని పిలిచేటప్పటికి క్లాసు గుమ్మందగ్గర అడుగుపెట్టి 'ప్రజెంట్ సార్' అన్నాడు. మాష్టారు అతనివైపుచూచి 'ఇంకా కొంచెం ముందు రావాలండిసార్'... 'గెట్ ఇన్' అని కూడా అనుమతిచ్చారు. తనపొరపాటును గ్రహించి తలవంచుకుని లోపలికి వెళ్ళి తన సీటు నలంకరించాడు.

హాజరు పిలిచిన అనంతరము 'అర్రే మొన్న చెప్పిన కాంపోజిషను నేడు చూస్తానన్నానుగదూ?' అని క్లాసందరిని ప్రశ్నించారు మాష్టారు. అందరు 'తెచ్చామండి. ఔను' అని ఏకకంఠధ్వని చేశారు. కాని అందరిలోను మధు కంఠమాత్రం పెకలలేదు. గుండెలు తెగిపడుని రీతిగా దడదడ కొట్టుకున్నాయి. పోయిన మూడు దినముల క్రితము చెప్పిన కాంపోజిషను విడికాగితముపైనే విశదపర్చాడుగాని పుస్తకంమీద తేటపర్చలేదు. కారణం? అతని నావరించియున్న లేమితనమే. ఇంట్లో నాన్నగారికి తన అవసరాన్ని అందించుకున్నాడు. కాని 'ఈవారంలో యెలాగో సర్దుకోనాయనా వచ్చేవారంలో నీకని ప్రత్యేకించి మూడణాలు వెనుకవేసియుస్తాను. అప్పుడు పుస్తకం కొనుక్కుందువుగాని.' అని ఫలితాన్నందించాడు. ఇప్పుడు మాష్టారికేం సమాధానంచెప్పాలో అర్థం కావడంలేదు.

మాష్టారు అందరి కాంపోజిషను చూస్తూ బాగున్నవారికి 'గూడ్' అని రిమార్కువ్రాస్తూ, బాగాలేనివారికి 'హాఫ్ ఎ డజన్ కట్స్ ఆన్ యువర్ హేండ్స్' అని రిమార్కువ్రాస్తూ, బహూకరిస్తున్నారు. ఆ సమయ నాయకమాయినట్లు పుస్తకమైనా కొనని నన్నేమంటారో అని గుండెలు బిగియబట్టి కూర్చుని యున్నాడు పాపం మధు.

---

(౧౨౮ వ పేజీ తరువాయి)

అనారోగ్య కష్టజీవనులు, మనమ భగవంతుడు కలుగజేయుటలేదు. అందుచే మనకంటె హీల్ స్కూల్లో లేచ ర్లకు ఎన్ని సదుపాయములు వున్నను, మనకంటె ఎక్కువ అనారోగ్యమునకు, దారిద్ర్యమునకు పాత్రులనియే నొక్కి వక్కాణించవచ్చును.

పోలీసుడిపార్టుమెంటువలె ప్రతివుపాధ్యాయుడు లవసర్వీసులో 2, 3, సం॥ములకు అప్పుడు ప్రధానోపాధ్యాయ పదవులు చేయుంచిన మునుపటి వారికని మంచి కలుగుననుకుందును. కాని వాడకట్టి భాగ్యము, ముందు కట్టి దురదృష్టము కలుగజేయు ప్రభుత్వము ఇప్పుడైన నడుమ, యిరుపక్షములవారము భగవంతుని గాని యోచవచ్చును. ఇప్పటికే పాతసుంకు పిసుకువల కలుగునని యింతటితో ముగించుచున్నాను. నమస్తే!

ఇంతలో మాష్టారు అతనినిసమీపించి "నీకాంపోజిషన్" అని ప్రశ్నించాడు. కూర్చున్నవాడు లేస్తూ 'పుస్తకమింకా కొనుక్కోలేదండి. ప్రస్తుతం విడి కాగితంమీద వ్రాశాను.' అని జాలివదనాన్ని చూపుతూ సమాధానమిచ్చాడు. కాని ఆ ఉపాధ్యాయునికి మాత్రం అతని మాటలు జాలికలిగించ లేదు. గుడ్లెర్రజేస్తూ 'ఆఁ? పుస్తకం కొనుక్కో లేదూ? అయితే నన్ను కొనియిమ్మంటావా యేంటి?' అని చేతిలో పుల్లను పారవైచి పైన చూరులో గుచ్చియున్న దసరా విల్లంబుబద్ద తీశాడు. అది చూడగానే మధు ఒళ్లు ఝల్లుమంది. 'మాష్టారూ! మా నాన్నగారికికూడా చెప్పానండి 'ఈవారంలో డబ్బుల్లేవు. మళ్ళీవారంలో కొనుక్కుందువుగాని' అని అన్నారండి అని గడగడ వణకుతూ చెప్పాడు. 'యేమిటోయ్ లేవోయ్ వెధవ! యేమంకా లేనమ్మట డొంకట్టుకు ప్రాకిందట. మూడురోజుల క్రితం చెప్పిన కాంపోజిషను నేటివరకు వ్రాయకపోయావంటే ఇదంతా మీకొరకా లేక మాకొఱకా! ముందు చేయిపట్టు...ఊఁ పట్టకపోయావా నీ వీపు చిట్లిందే. పట్టు.' అని విల్లంబుబద్ద సరిపాడు. పాపం దెబ్బంటే భయపడే మధు వణకిపోతూ చేయి త్వరగా అందించ లేకపోయాడు. ఇంతలో ఉపాధ్యాయుని హస్తంలోని విల్లంబుబద్ద మధు వీపుపై మూడవదెబ్బకు రెండుగా విరిగిపోయింది. కోపమాచల్లారని ఆ యుపాధ్యాయుని విరిగినముక్క విసరుకు, అడ్డుపెట్టిన మధు హస్తం అబ్బా అంది. దెబ్బతిన్న చేతికి రెండవచేతిని జతజేర్చి చలికాలపు కుక్కలా ముడగదీసుకుపోయాడు పాపమా బీదవిద్యార్థి. 'వెధవ...యెక్కు బెంచీ ఊఁ...ఈ పూటంతా నిలబడియుండు' అని ఆజ్ఞాపించి పోయి కుర్చీలో కూర్చున్నాడు. ఆ కరుణగలమహాత్ముడు ఉపాధ్యాయుడు బీదవిద్యార్థులంటే తనకంట్లో నలుసులు. పాపం మధు దెబ్బతిన్నది కూడా గాక పైపెచ్చు బెంచీపై కూడా నిలబడ్డాడు.

ఇంతలో ఉపాధ్యాయుడుగారు యేదో పాఠం ప్రారంభించారు. క్లాసంతా నిశ్శబ్దంగా కూర్చునుండి ఒక్కరు కూడా కిక్కురు మనకుండా పాఠం వింటున్నారు. కాని పాపం మధు కన్నీటి కదలిక కంఠం లేకుండా యుంది. వర్షాకాలపు నీటిధారల్లాగ అతని కన్నులనుండి జారుతూ తన రెండుపాదాల బొటన వ్రేళ్ళను ముద్దుపెట్టుకుంటూ యున్నాయి. ప్రక్కకు జారవేసియుంచిన అతని హస్తమునుండిరక్తబిందువులు జారి ప్రక్కనే కూర్చొనియున్న ఓవిద్యార్థి భుజాన్ని తడుపుతూయున్నాయి, బుజంమీద కలిగే అలికిడికి ప్రక్కకు తిరిగి చూచుకున్నాడు. తనచొక్కా నిండ రక్తపుచుక్క లున్నాయి. అది చూచుకుని ఆశ్చర్యపోయి 'మధూ! నీచేయి చిట్లిందా? నా మీద రక్తపుబొట్లు పడుచున్నాయే!' అని కరుణా హృదయుండై అడిగాడు,

కాని మధు కండ్లనీరు తుడుచుకొంటూ 'లేదు జయసింగ్ చేయిచిట్లలేదు' అని చేతిని వెనుకకు దాచి వేశాడు.

'చేయి చిట్లకపోతే ఈరక్తపుచుక్క లెక్కడివి? యేదీ చేయి చూడనియ్!' అని బలవంతాన అతని చేయి పట్టుకునిచూశాడు. యెఱ్ఱగాచిందించే రక్తాన్ని చూడగానే జయసింగ్ కండ్లు గిఱ్ఱున తిరిగాయి. 'యేమోయ్‌మధూ! ఇంత ఘాతకుపాలు పడి, లేదంటావేం?' అని మాష్టారుకేసి తిరిగి 'మాష్టారూ మధుచేయి చిట్లిందండి' అని కేకవేసి చెప్పాడు.

ఆమాట విని 'ఆఁ! చేయి చిట్లిందా' యేదీ?' అంటూ మాష్టారు కుర్చీలోనుండి లేచి వచ్చి చేయి చూచి 'అరె దెబ్బ బాగానే తగలిందనుకుంటానే? ......వెధవకిలానే ఉండాల్లే.........ఇలాతా.' అని తనకుర్చీవద్దకు తీసికొనిపోయి సీమసున్నము బేడుతో తిరిగి దెబ్బమీద వేసి రక్తప్రసరణ జరుగకుండ కట్టుకట్టి, 'పో......వెళ్ళికూర్చో.' అని అన్నాడు. తరువాత తానుకుర్చీలో ఆసీనుడగుచూ "జయసింగ్! మేముయేదీచెప్పినా మీఅభివృద్ధికేగాని మా అభివృద్ధికి చెప్తామా? అందులో యొంగగడియ ఒకొక్కప్పుడు ఇలా మారిపోతూయుంటుంది." అని ఆయన తనతప్పును ఉపసంహరించుకున్నాడు.

అందుకు జయసింగ్ "అయినా, మాష్టారూ. విల్లంబుబద్దతోనా అండికొట్టడం?" అనిఅడిగాడు!

దానికి 'కొట్టడమా? వెధవని చంపడమా? వాడిబాబేమో అప్పులపాలై చదివించడమున్నా, వీడేమో చదువులోనికివచ్చేటప్పటికిలా అశ్రద్ధగా కూర్చొవడమున్నా?' అనిఅన్నాడు తనపటుత్వాన్ని విడలేక.

"మధు యెప్పుడూ చదువులో అశ్రద్ధచేయుడండి ఇంకా, అప్పుడప్పుడు మేమే చేస్తూయుంటాము అతనికి అనుకూలపరిస్థితులు లేక అశ్రద్ధచేస్తాడేగాని, మాకు అన్నిపరిస్థితులు సక్రమముగాయుండి కూడా

# * చదువుకోవోయ్ ! *

చక్రాల తిరుపతిరాజు

(1) చదువుకోవోయ్-చదువుకోవోయ్
చక్కటి విజ్ఞాన మబ్బును
చదువకుండిన నీస్వరాజ్యపు
ఫలితమేమీ పొందలేవోయ్॥ చదు॥

(2) పూజ్యబాపుజి తెచ్చినట్టి
పుణ్యభారత స్వాతంత్ర్యం
పుడమిమీదను నిల్పబూనగ
పూజ్యుడౌ నీగురునిదగ్గర॥ చదు॥

(3) ప్రజల మన్ననల బొందినట్టి
ప్రథమమున కాంగ్రెస్సుపార్టి
ప్రజలప్రతినిధి నెన్నుకొనుటకు॥ చదు

(4) సరసకొచ్చెను సభ్యులెన్నిక
కార్యవంతుల శాంతిదూతల
సకలప్రజలకు సౌఖ్యమిచ్చే
సభ్యులను నీవెన్నుకొనుటకు॥ చదు॥

(5) దేశదేశాల్ తిరిగివచ్చిన
దేశరథికుండైన నెహ్రూ
అన్యదేశాలందు చదువులో
మిన్న గావలెననియు బల్కెను॥ చదు॥

(6) కులము మతముల కుళ్లుత్రోసెడి
పరమపూజ్యు డజాద్ పండిట్
దేశవిద్యకు ధీనిధియై
మంత్రిపదవిలో మసలుచుండగ॥ చదు॥

(7) జాతిఐక్యత దేశసఖ్యత
దేజరిల్లగ దీప్తినింపగ
భాషాప్రయుక్తపు భావినడలకు
బాధ్యుడవు గావలయునంటే॥ చదు॥

(8) పుణ్యభారత భూమియందున
పూజ్యులౌ ప్రాథమిక ఒజ్జలు
పురపురంబున దేశవిద్యలు
పూర్తిగా బోధించుచుండిరి॥ చదు॥

(9) విద్యయుంటే విలువగలదోయ్
విలువగలిగితే నిలువగలవోయ్
నిలువగలిగితే నీదుదేశపు
నిరక్షరాస్యత నిర్మూలింతువు॥ చదు॥

(10) దేశమంటే తెలుసుకోవోయ్
దీక్షయన్నది నిలుపుకోవోయ్
విద్యయందున దీక్షనిలిపితె
విజయములో ముందడుగు నీదె॥చదు॥

(11) చదువుకోవోయ్-చదువుకోవోయ్
చక్కని విజ్ఞాన మబ్బును
చదువకుండిన నీస్వరాజ్యపు
ఫలితమేమీ పొందలేవోయ్॥ చదు॥

---

(౨౧౬ వ పేజీ తరువాయి)

అశ్రద్ధచేస్తూయుంటాము. మరి మమ్మల్నిలా...?" అని జయసింగ్ అడిగాడు.

"యేడిశావ్ వెధవ! నోరుముయ్. నీకేం తెలుసు? మాష్టారు శిక్షిస్తారన్నభయం మీకేలేకపోతే మాట వింటారా? భవిష్యత్తులో మీ తల్లిదండ్రుల్ని పోషిస్తారా? ఇకరాద్ధాంతం కట్టిపెట్టి పుస్తకాలుతీసి 'విక్రమార్కనృపాలు'నిలో ఎనిమిదవ పద్యం చూడండి"—అని చదవడం మొదలుపెట్టాడు...

"విరుగ దరుగదు ఇసుమంత తరిగిపోదు;
కాలిపోవ దేనాటికి కూలిపోదు
విద్య వెలలేనిదానంబు విశ్వమందు
అట్టిదానంబు జేసినయతడె ఘనుడు."

అని పద్యం ముగించాడు.

ఇలా ఆరోజాయొక్క విమగ్రహం తన పరిత్రన స్థానాన్ని పీఠి మధుమీదుగా దొర్లిపోయింది.

(సశేషము)

# వయోజన విద్య

స్వతంత్ర భారతదేశంలో విద్య పూర్తిగా వ్యాపించాలని. అందుచేత ప్రాథమిక శిక్షణతోపాటు వయోజన విద్యను కూడా పెంపొందచెయ్యాలని, తద్వారా నిరక్షరాస్యతను నిర్మూలనం చెయ్యవచ్చునని పెద్దలంతా తీర్మానించారు. అనుభవజ్ఞులందరూ 'సరే' నన్నారు. ప్రభుత్వం చెవిలో వేశారు. ప్రభుత్వం కూడా దీనికి అడ్డు చెప్పలేదు. దాని శక్త్యనుసారము ద్రవ్యసహాయం చేస్తూ వృద్ధిపొందే మార్గాలను ప్రవేశపెట్టింది. గ్రామ పంచాయతీలు, అనుకూలమైన విధానాలూ ఒక్కొక్కటిగా కార్యరంగంలోకి దిగుతున్నాయి. పేరంతా ఎలుగెత్తి చాటుతూ బల్లలు గ్రుద్దుతూ యావజ్జీవితం యీ వయోజనవిద్యా ప్రచారానికే వినియోగించే వుద్దేశంతో కంకణధారులయ్యారు. అనేకమైన మార్గాలు అన్వేషించుతున్నారు. ఉపాధ్యాయులకు శిక్షణ తరగతుల ఏర్పాటు చేయుచున్నారు. పట్టాలు పొందినవారు వెలువడుతున్నారు ఉపాధ్యాయులు. యీ విధానమును యెంతగానో ప్రశంసించక తప్పదు.

కాని—

యీ యుపాధ్యాయులు చేస్తున్న దేమిటి? అధికారులు వారి నెలా యుపయోగించుకొనుచున్నారు? వారికి ఎట్టివిధమైన సదుపాయాలనిస్తున్నారు? ప్రస్తుతం వయోజన విద్య యెంతవరకు సఫలత చూపించినది యీ రెండు మూడేండ్లలో?—

14 సంllరములు మొదలు నలుబది సంవత్సరముల వరకుగల వయోజనులందరూ చదువుకొనవచ్చును. రోజునకు గంటన్నరమాత్రమే విద్య నేర్చుకొనవచ్చునని ప్రభుత్వాశయము. ఉపాధ్యాయునికన్న వయోజనులు వయసులో—సాధారణంగా— పెద్దవారుగానే యుందురు. ఐనను పెద్దవారికి విద్య నేర్పుటానికే ఉపాధ్యాయుడు కంకణధారుడగుచున్నాడు. వారిముందు నిలబడి వారికి జ్ఞానము వచ్చుటకు సాహసించుచున్నాడు. అట్టియెడ వయోజనుని మనస్తత్వమునకు అనుగుణముగ మెలగవలసియున్నది. వయోజనుడు సాధారణముగ పల్లెలలో వ్యవసాయదారుడుగనే యుండును. పగలెల్ల కష్టించి పని చేసి ప్రొద్దు గుంకు వేళకు నిల్లు చేరును. అట్టిసమయమున విద్యపై నెక్కువ యాసక్తియుండదు. ఉన్నవారుండరు. ఐనను ఉపాధ్యాయుడు తన మేధాసంపత్తి నుపయోగించి వయోజనుని మనస్తత్వమునకు వ్యతిరేకము లేకుండ నుండునట్లు ప్రయత్నించి విద్యయనిన నాతనికి అభిరుచి కలుగునటుల నచ్చచెప్పుచున్నాడు. వయోజనుడు కనీసము రెండు దినముల కొకపర్యాయైనను పాఠశాలకు వచ్చి విద్యను నేర్చుకొనుచున్నాడు, యింత మాత్రమున చాలదు. వయోజనునకు చిన్నపిల్లలకు చెప్పినట్లు భయముగ చెప్పలేము. అతనికి స్వతస్సిద్ధముగా ఉపాధ్యాయుని మాట లాలించి, విద్యయందు అభిలాష కలుగచేయవలెను. ఒక్కొక్కప్పుడు వయోజనులు పాఠశాలకు రావడమే మానుదురు. నిన్నను పాఠశాలకు రాలేదేమి? యని ఉపాధ్యాయుడు మరునాడు ప్రశ్నించిన, కారణం చెప్పరు. గట్టిగా మందలించలేడు. గతిరాత్రియంతయూ ఉపాధ్యాయు డొక్కడే పాఠశాలలో కూర్చొనవలసి యుండును. యింకను ఉపాధ్యాయుడు బోధనయందు పాతపద్ధతులనే అవలంబించి విద్యనేర్పుచున్నాడు. క్రొత్త పద్ధతులనుపయోగించుట తెలియదు. ఎందుచేతనంటే శిక్షణలేకపోవుటయే కారణము. శిక్షణ యున్నగాని వయోజనుల మనస్తత్వమును, సరియగు బోధనాపద్ధతులను, మిగిలిన యితర విషయములను, తెలిసికొనజాలడు. కనుక ఆశించినంత మేరకు వయోజనులను మనస్తత్వమునకు సరిపడినటుల వారి మనోల్లాసమునకు సరిపడునటుల ఉపాధ్యాయుడు బోధించజాలకున్నాడు. అందుచే వయోజనులు ఉపాధ్యాయునినుండి యేమియును పొందలేకున్నారు.

ఆ యా యీ కారణములచే కొన్ని జిల్లాలకు మాత్రమే శిక్షణాలయములనుంచుట ప్రయోజనము లేదు. ప్రతి తాలూకాకేగాని, కొన్ని తాలూకాలను

కలిపిగాని, లేక ప్రతిజిల్లాకు రెండుమూడు చొప్పున గాని, శిక్షణాలయములనుంచుట తప్పని సరియని తోచుచున్నది. కనుక శిక్షణపొందిన ఉపాధ్యాయులను ఆయా ప్రాంతములలోని వారినే నియమించుచూ ఆయా వయోజన కేంద్రములనే మాదిరి కేంద్రములుగా పరిగణించుచూ, ఆయా తాలూకాధికారులే పరీక్షాధికారులుగా నియమింపబడి, వారే శిక్షణా పత్రములను యిచ్చిన బాగుండును. యీ పద్ధతివలన మిక్కిలి ధనవ్యయము నుండదు. శిక్షణపొందినవారి కొరతయుండదు. తద్వారా వయోజనవిద్యావృద్ధి పొందుననుటకు సందియముండదు. కనుక త్వరలో ఉపాధ్యాయులకు శిక్షణనిచ్చి, ఉపాధ్యాయుల కొరతను తీర్చవలెను.

యింకనూ మరొక విషయము ప్రస్తుతపు ఇతర శిక్షణాలయములలోనే ఆ విద్యార్థులకు ఆయా విద్యలతోపాటు యీ వయోజనవిద్యా శిక్షణకు సంబంధించిన విషయములను కూడా నేర్పుచుండవలయును. ఇది నిర్బంధముగా అమలునందుంచవలెనే కాని ఐచ్ఛికముగా నేర్చుకొనుమనిన యెవరునూ నేర్చుకొనరు. యీ విధానమున కూడ శిక్షణ పొందిన వారి కొరత తీరగలదు. అటులనే ప్రస్తుతము పని చేయుచున్న ప్రతి యుపాధ్యాయుని శిక్షితునిగా చేయవలయును. ప్రతిగ్రామమునందునూ వయోజన విద్యాకేంద్రమును స్థాపించుటకు తగు ప్రయత్నములు చేయించవలయును. యీయీ విధానములవలన విద్య త్వరలో వ్యాప్తిచెందును.

ఇక అధికారుల విషయము, శిక్షణపొందని ఉపాధ్యాయులవలెనే అధికారులుకూడా వయోజన విద్య విషయమై కేవలము యేమియూ తెలియనివారుగానే యున్నారు. పాఠశాలకు వచ్చి యేయే విధానముల వలన పాఠశాల నడుపబడవలయునో, యెట్లు నడుపబడుచున్నదో, వయోజనులు యెంతవరకు కృతకృత్యులైనారో, విచారించుటకు తగిన శక్తి కలిగి యుండవలెను. ఉపాధ్యాయులకు తాము అనేక విషయములను తెలియజేయవలసియున్నది. లేని యెడల ఉపాధ్యాయులను ప్రోత్సహించువారై యుండరు. ప్రోత్సాహము లేనిదే యేపనియును చేయజాలముకదా ! కనుక ముందుగా అధికారులే శిక్షణ పొందవలయును. ఉపాధ్యాయులకు వయోజనవిద్యకు సంబంధించిన అనేక విషయములను తెలుపుచుండవలెను. మామూలు సెంటరుక్లాసులవలెనే వయోజన పాఠశాలోపాధ్యాయులకు కూడా సెంటరుక్లాసునుపెట్టి మాదిరి పాఠమును యిచ్చుచు, విద్య నభివృద్ధి పరచుటకు అనువైన మార్గములు గూర్చి చర్చించుచుండవలయును. నెలకొక పర్యాయము వినయూ గ్రామమునకు వచ్చి ప్రజలకు వయోజనవిద్య గూర్చి పలువిషయములను బోధించుచుండవలయును. తెల్లవారినదగ్గరనుంచి ప్రతిక్షణమూ తమవద్దనే తిరుగుచున్న ఉపాధ్యాయుడు చెప్పినవిషయములకన్న యితరవిద్యాభిమానులు నెలకొక పర్యాయము వచ్చియైన చెప్పినచో విషయములయెడ అభిలాష కలుగును. రక్తియుండును. ఆచరించుటకు యిష్టపడుదురు.

సుమారు రెండున్నర సంవత్సరములనుండి విరివిగా వయోజన విద్యాకేంద్రములను యేర్పాటుచేసి, విద్యను అభివృద్ధి పరచుచున్నారు. అయిన నీవిద్య యిప్పటికి యెంతవరకు నభివృద్ధి నొందినది ? ఏమియు లేదనే చెప్పకతప్పదు. విద్యగఱపు విధానమే యుపాధ్యాయులకు తెలియదు. నేర్చుకొను అభిలాష వయోజనులందు కలుగలేదు. యేగ్రామమున గాని వయోజనవిద్య యనిన అర్థమే తెలియదు. దీనికి కారణమేమి ? ప్రతి గ్రామమునందును వయోజనవిద్యాకేంద్రము లేకపోవుటయే కారణము. యింకను మరియొక సంగతి. ప్రతిగ్రామమునకు అనేకసంస్థల యధికారులు పోవుచున్నారు. యేవిధముగనో ప్రజల నాయత్తపరచి యేదేనివిషయము గూర్చి చర్చించుచుందురు. అట్టితరి "మీయూర పాఠశాలకలదా ? ఉపాధ్యాయులుకలరా? రాత్రిపాఠశాలయున్నదా? చదువుకొనినయెడల నిట్టి లాభములుగలవు" యని ముచ్చటింపక పోవుటయే దీనికి ముఖ్యకారణము. గ్రామములందు విద్యావిహీనులగు లిటికేషనుదారు లనేకులుందురు. వారి ఆటంకములు కూడ విద్య అభివృద్ధి కాకుండుటకు మార్గములు. ఆయా కారణములచే మొత్తముపై వయోజనవిద్య ఎక్కువ ప్రచారములోనికిరాలేదు.

ప్రతియూరనూ ప్రస్తుతమున్న ప్రాథమిక పాఠశాలకు అనుబంధముగనో, లేక ప్రత్యేకముగనో, ఒక వయోజనవిద్యా కేంద్రమును, స్థాపించవలయును. సాధ్యమగునంతవరకు నిర్బంధమును అమలునందుంచిన మంచిది. ప్రతియుపాధ్యాయుడును వయోజనవిద్యా శిక్షణ పొందవలయుననే నిర్బంధించి, విరివిగ శిక్షణాలయముల నెలకొల్పవలయును. పైనచెప్పినట్లు

# — బొమ్మల పాట —

సరోజా శ్రీ వేణుగోపాలరావు

అమ్మాయిలూ! మీరు బొమ్మల ఆటలు ఆడుకుంటారు కదూ! అయితే ఈ పాటపాడుకుంటూ ఆడుకోవండి మీ చేతగాకుంటే మీగురువుగారిచేత చెప్పించుకోండి!

అక్కా అక్కా రావమ్మా
ఆడూ కొందము రావమ్మా
ఇల్లూ వాకిలి ఊడ్వండి
ఈకల చీపురు కట్టండి
ఉప్పూ బియ్యం తెప్పించు
ఊళ్ళో బంతికి పిలిపించు
ఎక్కడెక్కడి స్నేహితులూ
ఏమో షోకుగ వచ్చారూ
ఐనదివంటా శుభ్రముగా
ఒప్పుగ విస్తళ్ళు వేయాగా
ఓహో యనుచు మనమంతా
ఔరా యనుచు భోంచేద్దాం
అందరుకలసి పప్పన్నం
అః యనుచు తినుకున్నాం

ఇదిగో పాపాయిలూ ఈపాటలోని ప్రతివరుసలోని మొదటి అక్షరం తీసుకొని ఒకమాలగా గూర్చండి.

---

# బావ బడాయి

రుద్రాభట్ల వెంకట భాస్కరరావు – చాపర

1. బావా! బావా! బక్క
తిరగలి కొయ్యా టెక్కు
అడ్డెడు బియ్యం అన్నంవండి
తవ్వెడు పప్పు తయారుచేస్తే
టెక్కుగిక్కు చేయక నీవు
ఒక్కముద్దగా మెక్కు

2. పర్సనుచూస్తే బడాయిజాస్తి
లోపలచూస్తే పైసా నాస్తి
దుస్తులు వేస్తే ధుమా ధుమా
ఆ, ఆ లైనా రావుసుమా
బావా నీకా నిక్కు?
వద్దుసుమా ఆ టెక్కు

---

(౧౪౯ వ పేజీ తరువాయి)

తనిఖీ దారులుకూడా శిక్షణపొందిన మంచిది. గ్రామములు వెంబడివచ్చు ప్రతిసంస్థయొక్క అధికారియు ఈ విషయమునుగూర్చి తప్పనిసరిగా ముచ్చటించుచుండవలయును. అందుముఖ్యముగా నారోగ్య శాఖాధికారులు తమవద్దనుండు మ్యాజిక్ లాంతర్ల నుపయోగించి ప్రజాహిత విషయములను, ఆరోగ్య విషయములను, తెలియజేయవలయును.

ప్రతి గ్రామమునందును గ్రంథాలయమొకటి నెలకొల్పబడవలయును. దానినిగూర్చి ప్రతి అధికారియు, ప్రతిపౌరుడును, ఎంతయోని పాటుపడవలసియున్నది.

ముఖ్యముగ ప్రస్తుతపు వేతనమైన విదురూపాయిలు, ఎనిమిదిరూపాయిలు, వలన ఉపాధ్యాయులు ఉత్సాహముతో పనిచేయజాలరు.

వి. పార్వతీశం.




చిట్టి తమ్ముళ్ళూ! చెల్లాయిలూ! ప్రక్కనచూపిన అర్థప్రకారం ఈ వింత మాటల్ని ఒకొక్క అక్షరంతో పూరించండి మీకు తెలియకపోతే మీపంతులుగారిని అడిగి తెలుసుకోండి బలే గమ్మత్తుమాటలు.

| పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|
| 1___లము | ప్రాతపనిముట్టు | 6___లము | యుద్ధము |
| 2___లము | వ్యవసాయపు పనిముట్టు | 7___లము | వస్త్రము |
| 3___లము | పండు | 8___లము | జాతి |
| 4___లము | ఒకరంగు | 9___లము | సత్తువ |
| 5___లము | చేపలుపట్టుసాధనము | 10___లము | ఆధారము |

—కొల్లూరు సోమేశ్వరరావు - చిక్కవోలు

౨ వ పాఠము

| పదము | అర్థము | పదము | అర్థము |
|---|---|---|---|
| 1___రము | ఒక రుచి | 4___రము | ఏనుకోంజులు |
| 2___రము | రోగము | 5___రము | దేవుడు ఇచ్చునది |
| 3___రము | చంటిపిల్లలు త్రాగునది | 6___రము | గాడిద |

—అల్లంరాజు బంగారం - కొంతలగి.

---

# వివేక ప్రశ్నలు

1. నాల్గక్షరముల పురమది;
పాల్గొన 'కుడ్యంబు' తనరు -
ప్రథమాంతములన్;
'వాల్గంటి' ఆది రెంటను;
కన్గొన 'గిరి' యగును రెండు -
కడవర్ణములన్.

—శ్రీమతి వి. మాణికమ్మ,
టీచరు - సెంట్రల్ స్కూలు - ధర్మవరం.

2. నాల్గువర్ణంబు లోకగొప్ప-నదికి చెల్లు;
ఆదిచివరలు కలిపిన - అగు సమాధి;
చివరి రెండును పంటకు-చెల్లు; రెండు
నాల్గు, త్రోవయగును; నదీనామమేమి?

—ఇప్పిలి కృష్ణమూర్తి పంతులు,
టీచరు మేనేజరు - మహాదేవవలస.



## అంట్రయిండ్ టీచర్లకు అధోగతేనా ?—

ఆర్యా !

ప్రస్తుతము పల్లెబడులలో E. S. L. C. గాని 3 వ ఫారంగాని, ప్యాసయినవారును, 4, 5, 6 ఫారములలో ప్యాసైన లేక ఫేలయినవారును అంట్రయిండు ఉపాధ్యాయులుగా పనిచేయుచున్నారు. వీరు పనిపాట్లు చక్కగా చేసుకొనుచున్నప్పటికి, ప్రభుత్వమువారు వీరిని చిన్నచూపుజూచి, మానేజరుకు ట్రయిండుటీచరు (ఏ గ్రేడువారైనను) లభించినపక్షమున ఎంతసర్వీసుగల అంట్రయిండు టీచరునైనను నోటీసులో నిమిత్తంలేకుండా తీసివేయవలసినదిగా ఆర్డర్లు జారిచేసియున్నారు. ఇది వారి జీవనమును మిక్కిలి భంగపరచుచున్నది. ట్రయినింగుకొరకు దరఖాస్తుచేసినవారికి ఆర్డర్లు రాలేదు. అంట్రయిండుగా పనిచేయుటకు వీలులేదు. వేరే ఉద్యోగము దొరకదు. ఇందువలన వారు అధోగతిపాలగుచున్నారు. ట్రయిండు ఉపాధ్యాయుడు లభింపనిచేత, ఏమానేజరైనా అంట్రయిండ్ ఉపాధ్యాయుని వేసినప్పుడు (ప్రిపోర్షను ఉండినప్పటికి) ఆ అంట్రయిండు ఉపాధ్యాయుని ఎగ్జంక్షన్ నిమిత్తం దరఖాస్తుచేసిన 6 మాసములవరకు అధికార్లు ఎగ్జంక్షన్ ఆర్డర్లు యివ్వకపోవుట, సంవత్సరమునకొకసారి గ్రాంటునిచ్చుట జరుగుచున్నది. ఈకాలములోగా వారి జీవనమెట్లు గడుపగలరని అధికార్లు తలంపకపోవుట కడుంగడు శోచనీయము. ప్రభుత్వమువారు అంట్రయిండువారిపట్ల అన్యాయపుదృష్టి ప్రసరింపక — ట్రయినింగుసీటుకొరకు దరఖాస్తుచేసినవారలలో వీలైనంత ఎక్కువమందికి సీట్లు కల్పించ ఆర్డర్లు జారిచేయుట; అట్లు ఆర్డర్లుపొందలేని వారికి అంట్రయిండు ఉపాధ్యాయులుగా పనిచేయుటకు అంగీకరించుచూ ఎగ్జంక్షను వెనువెంటనే శాంక్షను చేయుట; ఇతర డిపార్టుమెంట్లులో M.P.S.C. వారికి, Non-M.P.S.C. వారికిగూడ ఒకటవతేదీనే జీతము యిచ్చురీతిని అంట్రయిండువారికిగూడ ట్రయిండుటీచరులతో నెలజీతములుయిచ్చుటచేసి, మొదటే చితికియున్న ఉపాధ్యాయులకు చేయూతనిచ్చి కాపాడవలసినదని విద్యాశాఖాధికార్లను వినయపూర్వకముగా వేడుచున్నాను.

వేణమ్మపేట
28—9—1951.

యమ్. వేంకట్రావు పట్నాయక్,
సెకండరీగ్రేడు టీచరు.



# సెప్టెంబరు నెల చిత్ర ప్రశ్నలు

## (1951 సం॥ సెప్టెంబరు నెల సంచికలో ప్రకటింపబడిన)

## వివేక ప్రశ్నలు

### అను చిత్రప్రశ్నలకు సమాధానములు.

### ౧. తామర ౨. నల్లగలువ. ౩. మకరము.

చందా నెం. అన్ని ప్రశ్నలకు సరియైన సమాధానములు పంపినవారు.

208 జుఝువరపు వేంకటేశ్వరరావుగారు-కొమరవోలు
82 కె. చంద్రాయుడుగారు-టీచరు-కొండవండ్లపల్లె
259 తారుణిపధి-సెక్రటరి-టి. ఎ. సెంటరు-అరుకువల్లి
217 జి. ముకుందరావుగారు - టీచరు-అరుకు
161 బి. రామకృష్ణయ్యగారు - టీచరు-మారూరు
402 ఆర్. సత్యనారాయణగారు-టీచరు-మేనేజరు-గార్రాజు చీపురుపల్లి
181 యం. నారాయణశాస్త్రిగారు - టీచరు-బందరు
455 అల్లంరాజు బంగారంగారు - టీచరు-కొంతంగి
368 అల్లంరాజు సూర్యారావుగారు - హెడ్మాష్టరు-శృంగవరము
439 కణితి కొరునాయుడుగారు - విద్యార్థి - ముద్దపువానిపేట
349 యం. శ్రీరాములుగారు - దేవరాయపల్లె.
346 బి. నరసయ్యగారు - సెక్రటరీ, టి. ఎ. సెంటరు - కోడూరు
403 ఇప్పిలి కృష్ణమూర్తి పంతులుగారు - టీచరు మేనేజరు - మహాదేవవలస
480 పి. అప్పారావుగారు - టీచరు మేనేజరు, హెడ్ మాష్టరు, రావిపల్లి
న్యాయవేదాంత శిరోమణి నారాయణమూర్తిగారు - హెడ్మాష్టరు - ఆళ్ళగడ్డ
గుండేపూడి హనుమంతరావుగారు - రామా అండ్ కో., - శనివారపుపేట
264 కొశిన ఆదినారాయణగారు - విద్యార్థి - గరులియా - పశ్చిమ బెంగాల్
208 కూరాడ గోపాలంగారు - గెడ్డవానిపేట
202 భోగాపురపు సీతారామస్వామిగారు - హెడ్మాష్టరు - కొట్టిశ
78 కె. రామం దొరగారు - టీచరు - గజపతి నగరం
288 వి. రామయ్యశెట్టిగారు - హెడ్మాష్టరు - రంగాపురం
14 దేగల సత్యనారాయణగారు - మేనేజరు - కోటిపాం
138 వాడపల్లి కనకాచార్యులుగారు - టీచరు - బెల్లంపూడి
228 బాదిరెడ్డి సింహాచలంగారు - హెడ్మాష్టరు - కలగాడ
471 ఉదగిరి అప్పలనరసయ్యగారు - హెడ్మాష్టరు - చీచలపువానిపాలెం
503 ఎన్. హెచ్. నారాయణరావుగారు అలంబజారు - కలకత్తా
232 కొల్లూరు సోమేశ్వరరావుగారు - ఒక్కవోలు
427 చిమలమర్రి వెంకటకృష్ణయ్యగారు - హెడ్మాష్టరు - వల్లేరు
569 కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు పెయిద
పొట్లూరు వెంకటనరసింహారావుగారు - టీచరు - చవటపాలెం
కందికొండ మార్కండేయరావుగారు - రామా అండ్ కో., - ఏలూరు



# సంపాదకీయము

## విద్యాభివృద్ధి ఎట్లు ?

భారత దేశం సర్వ స్వతంత్ర దేశమయింది. సంతోషిస్తున్నాము. స్వాతంత్ర్య సుఖాన్ని అనుభవిస్తున్నాము. కాని స్వాతంత్ర్యం అంటే ఏమిటో, స్వతంత్ర పౌరుడు ఎలావుండాలో, మన నూతన రాజ్యాంగంలో ప్రతిపౌరునకు గల హక్కులేమిటో, మనలో ఎంతమందికి తెలుసు ? నిజానికి భారతదేశం మొత్తం జనాభాలో నూటికి ఏముగ్గురు నలుగురో వుంటారేమో తెలిసినవారు ! తక్కినవారికి యీగొడవే తెలియదు. కొద్దిరోజుల్లో నేఎన్నికలు జరుగబోతున్నవి! ఓటువిలువ తెలుసుకొని, మీ హక్కులనుగుర్తించి, సరియైన అభ్యర్థులను ఎన్నుకోండి అని నాయకులు ప్రజానీకాన్ని ఉద్బోధిస్తున్నారు. కాని ఓటు విలువ తెలిసినవారు, హక్కులు గుర్తించిన వారు, ప్రజా నీకంలో వుంటేనేగా ! ఇటు వంటి అజ్ఞానంలో పడివున్న ప్రజానీకాన్ని ఎన్ని సార్లు ప్రబోధించినా, ఎంత హెచ్చరించినా ప్రయోజనం లేదు. అసలు రోగమేమిటో తెలుసుకోకుండా, తెలిసినా సరియైన చికిత్స లేకుండ, ఎంత ప్రయత్నిస్తే లాభమేముంది?

ప్రజానీకంలో దట్టంగా అలముకొని వున్న యీ అజ్ఞానానికి కారణమేమిటో అందటికి తెలుసు ! విద్య లేకపోవుటయే అయితే విద్యను ప్రజానీకంలో వ్యాపింపజేసే మార్గం ఏమిటి "నిరక్షరాస్యతను నిర్మూలించాలి. అందటికీ సాధ్యమైనంత

(౧౬౩ వ పేజీ తరువాయి)

### మొదటి ప్రశ్నకు మాత్రమే

113 పొచిపెంట సన్యాసిరావుగారు - టీచరు మేనేజరు - అకులకట్ట
140 తెన్నతం సత్యగోపాలాచార్యులుగారు - జి. టి. స్కూలు - అనంతపురం

### ఒకటి – మూడు ప్రశ్నలకు మాత్రమే

573 యస్. బాలకృష్ణమూర్తిగారు - మేనేజరు - పెదంకలం
575 త్యాడ రాజగోపాలరావుగారు - మేనేజరు - పనసపెద్ది కోనవలస
157 బి. రంగరాజుగారు - హెడ్మాష్టరు - క్రిష్టిపాడు
111 దుంప రామమూర్తిగారు - టీచరు - చింతపల్లి పేట
430 యడవిల్లి కృష్ణమూర్తిగారు - బాడంగి
473 డాక్టరు చల్లకొలను తిరుపతిరాజుగారు - రామచంద్రపురం - నుజువీడు తాలూకా
238 మైలపల్లి నారాయణస్వామిగారు - పెదమేకపల్లి
బి. జాన్ - సెక్రటరీ - కోనాయిపాలెం సెంటరు

త్వరలో విద్యావంతులుగా చేయాలి, అందుకు ఉపాధ్యాయులంతా ముందుకు రావాలి, పాఠశాలలు పెంపొందాలి" ఈ విధంగా ప్రభుత్వంగాని, నాయకులుగాని, ఆచరణకు పూనుకోక ఉపన్యాసాలమీద ఉపన్యాసాలు దంచేస్తే ప్రయోజనమేమిటి? క్రియారంగంలో ఏమైనా చేయగలిగితేనేగా విద్యాభివృద్ధి ? మాటలతో ఏపనీ నెరవేరదుగదా ?

భారతదేశం మొత్తంమీద ఉచితమైన నిర్బంధ ప్రాథమికవిద్య అమలు పరచాలంటే డబ్బుమాటయెట్లున్నా ముందు ఉపాధ్యాయులే. ఇప్పుడున్న వారుగాక పదికోటిమంది కావాలని కేంద్రప్రభుత్వ విద్యాశాఖామాత్యులు చెప్పినారు. ఈ సంఖ్య తక్కువనియే చెప్పవచ్చును. ఎందుకంటే ఒక్కొక్కటీచరు ఇప్పుడున్న రూల్సు ప్రకారం ఇరవైమందికి మించి చెప్పలేడు. ఈ లెక్క ప్రకారం మొత్తం జనాభాకు కనీసం రెండుకోట్లమంది అయినా వుండాలి. అసలుకే గతిలేదు. నడికి దావాలాఅన్నట్టు కోటిమందికే కొరత అయినప్పుడు మరో కోటిమంది యెక్కడినుండి వస్తారు? కేంద్ర ప్రభుత్వం చెప్పిన లెక్క ప్రకారంచూచినా మన రాష్ట్రానికి ఇప్పుడున్న వారుగాక కొత్తటీచర్లు కొన్ని లక్షలమంది కావలసి వుంటారు. అయితే ఇంతమంది మనకు వున్నారా ? అసలు లభిస్తారా ? అన్నదే సమస్య. ఉపాధ్యాయుల కొరత నివారణ కాకుండా విద్యాభివృద్ధి జరగాలంటే ఎల్లా జరుగుతుంది ? ఈ సమస్యను పరిష్కరించకుండ కలము కాగితము వున్నది కదా అని విద్యాప్రణాళికలు తయారుచేస్తూ గడియ గడియకు మారుస్తూ, వుంటే ప్రయోజనం ఏమిటి. వట్టి ప్రణాళికలవల్ల విద్యాభివృద్ధి జరుగుతుందా ?

అయితే యీ వుపాధ్యాయులకొరత కల్పితమా ? స్వతస్సిద్ధమా ? ఎక్కువ భాగము కల్పితమని చెప్పక తప్పదు. అసలు ప్రస్తుత పరిస్థితుల్లో ఉపాధ్యాయ వృత్తేచాలనీచంగా పరిగణించబడుతున్నది. అందువల్ల అవకాశంవున్న వారందరూ సాధ్యమైనంతవరకు ఇతర వృత్తులలోకే పోతున్నారు. అథవా ఎవ్వరైనా ఇతర అవకాశాలులేక యీవృత్తికే పాల్పడితే వారికి అవకాశంలేకుండా పోతున్నది. ఏమంటారా? ట్రయినింగు కాకపోతే యీ వృత్తికి పనికిరారు. ట్రయినింగు కానివారికి యీవృత్తిలో స్థిరత్వమూ లేదు. భద్రతా లేదు. ఇక ట్రయినింగు విషయం చూతామూ అంటే సీటు సంపాదించుటకే యావజ్జీవాలు క్రుంగి పోతున్నవి. ఎన్నో వందలమంది దరఖాస్తులు పెట్టుకుంటే తీరావచ్చేది ఏకొద్దిమందికో. ఆకొద్దిమందికైనా సిఫార్సులు, లంచాలు, మొదలైనవి వుంటేనే ? ఈ కర్మం ఏమిటి ? ఒకవంక ప్రభుత్వం ఉపాధ్యాయులు కోరంటుంది విద్యాభివృద్ధికి? ఆప్రభుత్వమే ట్రయినింగుకు సీట్లు లేవంటుంది. ఈ అవకతవకయేమిటి ? నిజంగా ప్రభుత్వం విద్యాభివృద్ధిని ఆశించి ముందడుగు వేస్తున్నదా? లేక ముఖప్రీతికై తియ్యని మాటలు చెప్పుతున్నదా ? బోధపడుటలేదు.

ట్రయినింగు కేంద్రాలు తక్కువగా వున్నవని ప్రభుత్వం ఒకసాకు చెప్పవచ్చు. కాని విద్యాభివృద్ధిని కాంక్షించే ప్రజా

ప్రభుత్వం ఆ సాకు చెప్పితే ప్రజలు ఒప్పుకోరు. సంతృప్తి పడరు. ట్రయినింగు కేంద్రాలు కావలసినన్ని స్థాపించాలి. అడిగిన వారికెల్ల లేదనకుండ సీట్లివ్వాలి. అవసరమైతే ప్రతిహైస్కూలుకు అనుబంధంగా ఒక ట్రయినింగు సెంటరును నెలకొల్పాలి. అసలు ప్రభుత్వమే విద్యావంతులను ఉపాధ్యాయ వృత్తికి ఆకర్షించవలసిన అవసర మెంతో వున్నది. అటుసిథితిలో తమంతటతామే కోరివచ్చిన వారికి అవకాశం లేకుండ చేయుటయే ఎంతమంచిది ? ఇలా జరుగుతుంటే ఉపాధ్యాయుల కొఱత ఎలా తీరుతుంది ? విద్యాభివృద్ధి ప్రభుత్వం తలపెట్టినంతగా ఎలాజరుగుతుంది ? ఈ సంవత్సరం ఒక్క గుంటూరుజిల్లా మొత్తం మీద కొన్నివందలమంది ట్రయినింగు సీట్లు దొఱకక అల్లాడి పోయినారు. ఇలాజరుగుతుంటే మొదలే గౌరవంలేని యీవృత్తికి ఎవరు ఆశపడతారు?

ఈనాడు హైస్కూళ్ళు పెరిగాయి. విద్యార్థులసంఖ్య పెరిగింది. కాని ఉపాధ్యాయులు లేరు. వయోజన విద్యావ్యాప్తికి ప్రభుత్వం కంకణంకట్టుకొన్నది. కేంద్రాలు నెలకొల్పు తున్నది? ప్రణాళికలు ప్రకటిస్తున్నది. ఎంతో ప్రచారం చేస్తున్నది. కాని ఫలితంశూన్యం. అందుకు కావలసినంతమంది శిక్షణపొందిన ఉపాధ్యాయులు లేరు. నేడు నడుపబడుచున్న వయోజన పాఠశాలలు నామమాత్రములని చెప్పక తప్పదు. ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యను రాష్ట్రమంతట అమలుపఱచవలెనన్నను ఉపాధ్యాయులు లేరు. ఈ పరిస్థితులన్నీ ప్రభుత్వం గమనించి, ఉపాధ్యాయుల కొఱత లేకుండ వచ్చిన వారికందఱికీ ట్రయినింగు అవకాశాన్ని కల్పించి, అటు ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత, విద్యాభివృద్ధికి, ఇటు వయోజన విద్యాభివృద్ధికీ, హృదయ పూర్వకంగా కృషిచేయవలెననీ, నిరక్షరాస్యతా నిర్మూలనమును మాటలలోగాకుండ క్రియలో చూపవలసినదనీ, అప్పుడే సర్వతోముఖమైన విద్యాభివద్ధి జరుగగలదనీ, మనవి చేయుచున్నాము.

# స్వీకారము - సమీక్షలు

—.o:—

౧. 'గీతావాణి' :

ఇదియొక ధార్మిక మాసపత్రిక. ప్రతిమాసము 15 వ తేదీకి ప్రచురింపబడును. సంవత్సరపు చందా నాలుగురూపాయలు. విడిప్రతి ఆఱుఅణాలు.

గౌరవసంపాదకులు : పూజ్యపాద శ్రీశంకరానంద స్వామిజీ.

సంపాదకులు : ఆచార్య రామకృష్ణ, యన్. శ్రీకంఠమ్ గారలు.

కర్నూలుజిల్లా - ఆళ్ళగడ్డ 'గీతాప్రచురణసమితి'చే ప్రకటింప బడుచున్నది.

సులభమైన రచనలలో శ్రీమద్భగవద్గీతా తత్వమును ప్రజలకు తెలియజేయుటయే ఈ పత్రికయొక్క ముఖ్యోద్దేశము. నాస్తికత ప్రబలిపోవుచున్న యీరోజులలో వీరు గీతాసందేశమును వినిపించుటకు పూనుకొనుట యెంతయు ప్రశంసనీయము. నేడు మనము ప్రపంచదృష్టిలో ఒకవిశిష్టమైన జాతిగా నిలబడగలిగినామన్న అది మహోత్కృష్టమైన గీతాశాస్త్రము వలననే యనుమాట మఱవరాదు. భారతీయ సంస్కృతికి, ధార్మిక తత్వమునకు, గీతాశాస్త్రమే ప్రధానము. పవిత్ర భారత భూమికి ఈ మహాగ్రంథమే ప్రాణము. గీతాతత్వము తెలిసికొని ఆచరణలో పెట్టగలిగిననాడే మనము నిజమైన భారతీయులమనిపించుకోగలము. ఆనాడే మనజాతికి సర్వతో ముఖమైన వికాసము. నేడే 'గీతావాణికి' చందాదారులుగా చేరుడు.

సంపాదకుడు : 'గీతావాణి' - శ్రీగీతా ప్రచురణసమితి - ఆళ్ళగడ్డ-(p.o.)కర్నూలు జిల్లా.

౨. 'గుండాలకోన మాహాత్మ్యము' :

ఇదియొక వచనగ్రంథము. రచయిత: కోసంగి సిద్ధేశ్వరప్రసాద్. గ్రంథము వెల 0-4-6, ప్రకాశకులు : బాలమిత్రసేవాసంఘము, కోడూరు - కడపజిల్లా.

ఈ గ్రంథకర్త తొలిరచన 'ఈశ్వర స్తవము' అను పద్యగ్రంథము 'గుండాలకోన మాహాత్మ్యము' రెండవరచన. గ్రంథనామములం బట్టియే వాని తత్వము తెలిసికోవచ్చును. మొదటిది చెప్పనక్కఱలేదు. రెండవది ఒక పుణ్యక్షేత్ర మాహాత్మ్యము. 'గుండాలకోన' కడపమండలములోనిది, ఇచ్చట శివుడు ఎండ్రిరూపమున వెలయుటచేత ఇది కర్కటేశ్వరక్షేత్రమనియు చెప్పబడుచున్నది. కార్తికమాసమునందు, శివరాత్రి దినమునందు స్వామికి మహోత్సవములు జరుగుచుండును.

స్థానికమైన ఈ పవిత్రక్షేత్రకథను సులభమైన వచనములో రచించి గ్రంథకర్త భక్తజనులకు మేలుచేసినాడు. దైవజిజ్ఞాసకలవ్వారికి ఈరెండుగ్రంథములు చదువదగినవి. యువకుడు, భాషాభిమానియు నగు గ్రంథకర్త చిరంజీవియై తన రచనలమూలమున ఇతోధికముగా మాతృభాషాసేవ చేయుగాకయని మా దీవెన.

—సంపాదకుడు.




## 15—10—1951 నుండి 15—11—1951 వరకు.

మేషం—కార్యలాభము, శత్రుజయము, ప్రయాణము, ధర్మచింత, పుణ్యకార్యములు, శుభసంతోషాలు.

వృషభం—విజయము, చోరభయము, బంధుగమనము, కలహము, శరీరదౌర్బల్యము.

మిథునం—శత్రుపీడ, పరదేవతా సాక్షాత్కృతి, అందుమూలమున సర్వశత్రునాశనము, శుభ, సంతోష కార్యాలోచనలు, శరీరమందు ఉష్ణాధిక్యము.

కర్కాటకం—కార్యసాధనము, కపటము, ప్రయాణము, డాంబికము, ధనలాభము, శుభవ్యయము.

సింహము—శుభలాభము, శత్రునాశనము, స్థానలాభము, కార్యసిద్ధి, కౌటిల్యము.

కన్య—శరీరపీడ, అపమృత్యుభయము, ప్రయాణము, మిత్రసందర్శనము, ఆగంతుకలాభము.

తుల—ధననష్టము, విద్యాగోష్ఠి, మిత్రసమాగమము, శరీరాస్వస్థత, స్త్రీలాభము, పెద్దలయొక్క గౌరవము.

వృశ్చికం—శత్రువిజయము, పుత్రసంతానప్రాప్తి, లేక పుత్రసమానుల కలయిక, ధనలాభము, సద్గోష్ఠి.

ధనుస్సు—అర్థనష్టము, విజయప్రాప్తి, మానసికపీడ, కుటుంబయాతన, చిరాకు, పరాకు.

మకరం—శరీరదౌర్బల్యము, బంధుప్రాప్తి, విద్యాగోష్ఠి, వివేకవిద్యాపతనము, విద్వత్సమాగమము, ప్రయాణము.

కుంభం—శరీరబాధ, శిరస్వ్యథ, అపమృత్యుభయం, శత్రుకలహం, ఉత్తరదిశ ప్రయాణము.

మీనం—చంచలము, స్థానచలనము, ధనలాభము, వ్యయము, శుభప్రాప్తి, బంధుదర్శనము.

మీ గోచారభావఫలాలు జాతకకుండలిలోని గ్రహచారానరీత్యా పరిణామము పొందుచుండును.

☞ సిద్ధయోగిని, నాడీజ్యోతిషశాస్త్రరీత్యా జాతక, ముహూర్త, వాస్తు, ప్రశ్న కవచధారణవిధానము మొదలగు విషయములు విపులముగాను సరసముగా జెప్పబడును. వలయువారు నిలయము పేర కార్డు వ్రాసిన తెలియును.

ఇట్లు,

దైవజ్ఞభూషణ—పండిత డి. యస్. యన్. శాస్త్రి,

శ్రీ శివనాడీ జ్యోతిర్నిలయం, ఏలూరు. ప॥ గో॥ జిల్లా.






# ఉపాధ్యాయుల కోర్కెలను ప్రభుత్వం తీర్చాలి

## తాడిపత్రి సెంటరు ఉపాధ్యాయుల అభ్యర్థన

తాడిపత్రి సెంటరు మునిసిపల్ ఎలిమెంటరీస్కూలు టీచర్సు 1-9-51 వ తేదీ ఉదయం 10॥ గం॥ మునిసిపల్ సెంట్రలు స్కూలునందు శ్రీయం. చలమయ్యశెట్టిగారి అధ్యక్షత క్రిందను, అదే సెంటరులోని బోర్డుఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలు టీచర్సు మధ్యాహ్నం అదినమే 2 గం॥ పై తెలిపిన స్కూలునందే శ్రీ వి. నాగరంగయ్యగారి అధ్యక్షత క్రిందను, సమావేశమైరి. రెండుసభలలోను ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ సహాయ కార్యదర్శి శ్రీ వి. విజయరామరాజుగారుపన్యసించిరి. "ప్రాథమిక విద్యాభివృద్ధియందు ప్రభుత్వము చాలాచిన్నచూపుచూపుచున్నదని విద్యారంగములో వివిధ మేనేజిమెంట్లను సృష్టించి ఒకే గ్రేడుకు అనేక స్కేళ్ళను యేర్పరచుటద్వారా ఉపాధ్యాయులలో స్పర్థను యేర్పడి విద్యావిచ్ఛిన్నతకు దారి తీయుచున్నదని, జీవితవ్యయం పెరుగుచున్నను, జీతాలు పెంచకపోవటం 1947 సం॥ ప్రభుత్వము చేసిన వాగ్దానానికే చాలవిరుద్ధము, ఉపాధ్యాయులనుండి వృత్తిపన్ను వసూలుచేయుట చాలాబాధాకరమని, తమ స్థితిగతులను నివేదించుకొనుటకు సైతము సంఘస్వాతంత్ర్యముకూడా లేకుండా చేయుచున్నదని, రాజ్యాంగచట్టములో యిచ్చిన సంఘస్వాతంత్ర్యపు హక్కును ఉపాధ్యాయులకు వర్తింపచేయాలని, హైకోర్టులో సంఘంతరపున నే కేసు వేశాము, ఉపాధ్యాయులంత తమహక్కుల రక్షణకోసము దీక్షవహించాలని" చెప్పిరి. తదుపరి అధ్యక్షులవారు ఇరువురును ఉపాధ్యాయులకు ఐకమత్యము ఒక్కటే బలమైన ఆయుధమని మన అధ్వాన్నస్థితిని తొలగించుటకు సంఘటితపడాలని, తెలియబరచిరి.

ఉపాధ్యాయుల న్యాయమైన కోర్కెలు తీర్చాలని ఫెడరేషన్‌కు ఆర్థిక సహాయం చేయాలని, నెల్లూరులో జరుగబోవు రాష్ట్రిక కన్వెన్షన్‌కు యిద్దర ప్రతినిధులను పంపుటకు యేకగ్రీవముగా ఆమోదించిరి.

తాడిపత్రి }
ది 2—9—51 }

యం. చలమయ్య శెట్టి
సెక్రటరీ

## తెనాలి

ది 6-9-51 ఉదయం 8-30 లకు తెనాలి కొత్తపేట 18వ వార్డులో "శ్రీ వాణీ విద్యాలయము" అను పేరుతో పోచిరాజు వెంకట లక్ష్మీనరసింహారావుగారిచే నూతన ప్రాథమిక పాఠశాల ప్రారంభింపబడెను. తెనాలి ఈస్టురేంజి S. D. I. గారు అధ్యక్షులుగను, వెస్టురేంజి S. D. I. గారు ప్రారంభకులుగను, ఈస్టురేంజి J. D. I. గారిచే జాతీయ పతాకోత్సవము జరుపబడి, వెస్టురేంజి J. D. I. గారిచే గాంధి పటావిష్కరణము, గ్రంథాలయ ప్రారంభోత్సవము జరుపబడినవి. నూతన ప్రారంభోత్సవ సమయమున సదరు స్కూలు యాజమాన్యోపాధ్యాయులు పోచిరాజు వెంకట లక్ష్మీనరసింహారావుగారు, అల్పాహార విందు గావించిరి. వేంకట్రామా అండ్ కో, రామా అండ్ కో, ఓరియంటల్ పబ్లిషింగు, లలితా అండ్ కో పబ్లిషర్సువారు యేజంట్లు హాజరయిరి. వందన సమర్పణములతో కార్యక్రమము ముగింపబడెను.

తెనాలి, }
ది 6—9—1951. }

కంచిభొట్ల శివరామయ్య,
నేజరు, హిందూ ఎలిమెంటరీ స్కూలు.

## ఇంజేడు :

ఆంధ్రదేశ గ్రంథాలయాధ్యక్షుడు, వయోజనవిద్యా గౌరవ ఆర్గనైజరు, నగు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారును, అనంతపురము D. D. C. ప్రచారకాధికారులు, శ్రీ నాగేశ్వరావుగారును, కోటిపల్లి రేంజి, జూనియర్. డి. ఇ., శ్రీ కే. సుబ్బరావుగారును, 16-9-51 తేదీన మా గ్రామానికి విచ్చేయగా, వారిని మేళ-తాళములతో యెదుర్కొని వారికి బ్రహ్మాండమైన స్వాగతమిచ్చిరి. బహిరంగసభ జరుపబడెను. వారు ప్రజలు ప్రభుత్వముతో సహకరించవలసిన విధానములు వయోజనవిద్యావశ్యకత, గ్రంథాలయములవల్ల కలుగు ఉపయోగములనుగురించి చక్కని యుపన్యాసములిచ్చిరి. పిదప మా గ్రామములో జరుపబడుచుండు "శ్రీ గాంధీజీ గ్రంథాలయము"ను దర్శించి అమూల్యసలహాలనిచ్చిరి. ఇచ్చట శ్రీ బి. సి. వి. సుబ్బరాజు గారిచే "వయోజనవిద్యా కేంద్రము"ను ప్రారంభించి, ప్రారంభోత్సవము జరిపి-బువ్వ, విలువ-విపులీకరించిరి. తదుపరి జాతీయగీతములతో సభ ముగించబడెను. బి. సి. వి. సుబ్బరాజు. H. M.

## అమలాపురం :

అమలాపురం తాలూకా ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూలు టీచర్ల యూనియన్ వర్కింగు కమిటీ సమావేశము ది 23-9-51 తేదీ ఆదివారం పగలు 2 గంటలకు అమలాపురం శ్రీనివాస ఎయిడెడ స్కూలులో యూనియన్ ప్రెసిడెంటుగారగు మ॥రా॥శ్రీ కె. సోమేశ్వరరావుగారి ఆధిపత్యమున జరుపబడి యీ దిగువ తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడినవి.

I. ధాన్యం అధికోత్పత్తియగు యీ గోదావరి సెంట్రలు జిల్లాలోనే సేరు బియ్యంధర రెండు ఇంపీరియల్ సేరులు బియ్యం సంచితో సహా రు. 50-8-0 లు అమ్ముచున్నందున యీ రోజులలో ఉపాధ్యాయుల కిచ్చు వేతనములు D. A. తో సహా వారికుటుంబముల కగు బియ్యం ఖర్చులకయినను చాలి చాలనట్లుండుటవలన ఉపాధ్యాయులయొక్క వేతనములు కనీసము రు 100 లు వందరూపాయలకు తక్కువ గాకుండ యుండునట్లు శాంక్షను చేయించి యిప్పించగలందులకు ప్రభుత్వమును, విద్యాశాఖాధికారులను, కోరుచు ఏకగ్రీవముగా ఆమోదించిరి.

II. ట్రయినింగు స్కూలులో జాయిను అయి సెకండరీగ్రేడు (Secondary grade) ట్రయినింగు శిక్షణ పొందుటకు తగినన్ని మార్కులు S. S. L. C. పబ్లికు పరీక్షలో (Higher grade) టీచరు సంపాదించియున్నయడల, అట్టి టీచరు మరల ట్రయినింగు అవకుండ (Without further training) సెకండరీగ్రేడు ట్రయినింగు పరీక్షకు ప్రయివేటుగా హాజరగుటకు అర్డరు దయచేయించమని ప్రభుత్వమును విద్యాశాఖాధికారులను కోరుచు ఏకగ్రీవముగా తీర్మానించిరి.

III. T. P. F. చందాలు కట్టుకొనుటకు వీలుగా ప్రతి నెల 10 వ తేదీ లోపుగా బిల్లులు చేయు నట్లుగా పంపుటకు జిల్లావిద్యాశాఖాధికారిగారిని కోరుచు తీర్మానించిరి.

IV. జోగిరాజుపాలెం ఎయిడెడ్ స్కూలు టీచరు కడలి గంగిశెట్టి గారిని మేనేజరు అన్యాయముగా తొలగించెనని లోగడ సదరు టీచరు పంపిన పిటీషను విషయములు సబుకమిటీ ఇన్క్వయిరు చేసిన మీదట మేనేజరున్ను టీచరున్ను రాజీనామా (ఎడ్జస్టుమెంటు) అయినట్లు తెలియవచ్చినందున సదరువిషయము వ్రాత మూలకముగా యీ యూనియనుకు ఒక రిపోర్టు పంపించగలందులకు టీచరును కోరుచు తీర్మానించిరి.

V. ఎయిడెడ్ స్కూలులో పనిచేయుచున్న ఉపాధ్యాయులను రు. 8 లు సమస్యను గురించి గాని తూ॥ గో॥ జిల్లా విద్యాశాఖాధికారిగారు క్రొత్తగా జారిచేయించిన Circular సరియ్యలం R. O. C. NO 380 A Date 5-9-51 ప్రకారముగాని తగ్గించకుండా వుండుటకున్ను సదరు విషయములను గురించి ప్రభుత్వమునకు (Memorandum) మెమోరాండమును సమర్పించుటకున్ను, అవసరము అయినయెడల డిప్యుటేషన్ వెళ్లుటకున్ను, కోరుచు తీర్మానించిరి.

అమలాపురం,
23—9—51

సి. నాగభూషణము,
కార్యదర్శి.
తాలూకా ఎయిడెడ్ టీచరు యూనియన్, అమలాపురం.

## పెదపాడు సెంటరు :

ది 15-9-51 శనివారం పెదపాడు కేంద్రోపాధ్యాయ సంఘ సమావేశమునందు యీ దిగువ తీర్మానములు ఏకగ్రీవముగా సభవారిచే ఆమోదింపబడెను.

### ఆమోదింపబడిన తీర్మానములు.

1. శ్రీ గౌరవనీయులైన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు మన దేశ కాంగ్రెస్ సంస్థకు ప్రెసిడెంటుగా ఎన్నికైనందుకుగాను యీ సభవారు తమ సంతసమును వెల్లడించుచున్నారు.

2. శ్రీ స్వామి సీతారాంగారు, వారి బృందము ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు నిరాహారదీక్షను పూనించినందుకు వారిని అభినందిస్తూ, వారి కోరికను సిద్ధింపజేయవలసినదిగా ప్రభుత్వమువారిని ఈ సభవారు కోరుచున్నారు.

పెదపాడు,
30—9—1951.

మైలవరపు సూర్యనారాయణ,
సెక్రటరీ, పెదపాడు సెంటరు - ఏలూరు తాలూకా.



Edited by Sri M. Venkata Ratnam Garu, B.A., & Printed and Published by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru.

ANDHRA RASTRA PRARAMBHA VIDYA
Regd. M.N. 3766 Vol. 40. - No. 7




# శ్రీ మోక్షగుండ రామాయణము

## యక్షగానము (హరికథ)

(అష్టకాండలుగల సంపూర్ణరామాయణము)

శ్రీ తాళ్ళూరి నారాయణ సత్కవి విరచితము

ఈ గ్రంథమింత స్వల్పకాలముననే తొమ్మిది ముద్రణములు వేయబడి వేల ప్రతులు అమ్మబడియుండుటే దీని ప్రాశస్త్యమునకు నిదర్శనము. పద్యములు, పాటలు, కీర్తనలు, మట్లు, తోహరలు అతి మనోహరములు. ప్రతివారును చదివి ఆనందింపదగినది. హరిభక్తులగు స్త్రీ పురుషులకు మిగుల ఉపయోగము.

క్యాలికో బైండు వెల రు. **3-8-0**

---

# అష్టాదశపురాణసారము

(18 పురాణములు నాల్గుభాగములలో ముద్రించబడినవి.)

వేమూరి జగన్నాథశర్మ విరచితము

ఇహపరసాధనకు 18 పురాణముల విశేషములను ప్రతివ్యక్తియు తెలుసుకొనుట ఎంత ముఖ్య అవసరమో అందరికిని తెలిసినవిషయమే. అట్టి పురాణములు సంస్కృత భాషయందుండుటచేత అందరును చదివి ఆనందించుటకు వీలు కలుగుటలేదు. ఆకొరతను తీర్చుటకు మేము పురాణముల నన్నిటిని సంగ్రహముగా విన్నదు కని విని యెరుగని కథలను సులభశైలిని రసముప్పతిల్లునట్లు ఆబాలగోపాలము చదివి యానందించునట్లు వ్రాయించి ప్రచురించియున్నాము. కొద్దికాలముననే అనేక వేలప్రతులు అమ్మబడియున్నవి.

విడిప్రతి 1కి సాదాబైండు వెల: **1-4-0.**
4 భాగములు కలిసిన క్యాలికో బైండు వెల: **5-8-0.**

ప్రకాశకులు:

## రామా అండ్ కో., (H. O.) ఏలూరు.

బ్రాంచీలు: గుంటూరు – రాజమండ్రి – భీమవరము – తెనాలి – విజయనగరము.